# గోలకొండ పత్రిక

స్వభాను సం౹౹ర మార్గశిర బ౹౹ ౧౧ గురువారము


## అంతర్విద్యా పీఠము

భారత దేశములో క్రొత్తవి పాతవి కలిసి (౧౮) విద్యా పీఠాలు కలవు ఈ పీఠాల న్నియు ఇంగ్లీషు ప్రధానముగా బోధించు పీఠాలు ఈ పీఠాలకు కులపతు లనేవారు ( వైస్‌చాన్సలర్లు ) కలరు వారందరున్నూ ఏటేట ఒక విద్యా పీఠస్థలములో కలిసి అఖిల భారత విద్యా విధానమును ఏకధాటిగా నడిపించు ఆలోచనలు చేయుదురు, వారి నిర్ణయాలు ఎవ్వరినైనా బాధించునా లేక బంధించునా అని అడిగితే అట్లేమీ లేదుకాని వాటికి శాస్త్ర విలువ కలదు విలువ లేకుంటే వారికి శ్రమ వారిని పిలిచినవారికి శ్రమయే, కాకుండా ద్రవ్యనష్టంకూడా అంతావృధాయాసముగా నుండును వారే ఏకస్థులై వారే నిర్ణయించిన దానిని ఆచరించక పోతే వారి నిర్ణయ ఒను బర్మావారు, సిలోనువారు, ఆఫ్గనిస్థాన్ వారు మున్నగు క్రొత్త యూనిటివారు ఆచరిస్తారా మరి? తమ నిర్ణయాలను తమలో ఎవ్వరైనా ఆచరించకపోతే తక్కిన వారలేతా మళ్ళీ సమావేశమైననాడు జరిగిన ఉద్యంతాలను పరిశీలించి ఏమయ్యా మన నిర్ణయాలను మీరెందుకు ఆచరించలేదు అని అడుగుతారు అప్పుడైనా అంద రిలో ఆచరించని వారికి కాస్త కష్టముగా నుండును కదా. పైగా తక్కిన వారంతా కలిసి మీ విద్యాపీఠం డిగ్రీలను మేము ఒప్పుకోము. వాటికి అంత వాటికి వెలి జాగ్రత్త! ఇక కాచుకో చూచుకో అని ఆగ్రహించితే మెట్లు? అట్లు చేయుటకు వారు సమర్థులే కావున వాటి నిర్ణయాలకు కాస్తోకూస్తో విలువ యుంటుందనే అనుకోవలెను

ఈ సంవత్సరము అంటే గత మాసం క్రిందటనే మన హైదరాబాదుకు అఖిల భారత విద్యాపీఠ సమితి వారు ఆహూతులైరి. అదిమనఅదృష్టం. ఎందుకంటే కులపతులు విద్యాధికారులు, వారి కార్యదర్శులు మన నగరములో విభ్రాజమానులైరి వారుమనకు దర్శనమిచ్చిరి వారిలో పలువురు బహిరంగోపన్యాసా లిచ్చిరి మన ప్రభుత్వమువారు వారికి బిదరు గాలి తినిపించి అజంటా ఎల్లోరా గుహలకు పంపించిరి వారికి విందు లిచ్చిరి వారికి సకల సౌఖ్యాలు చేకూర్చిరి దానికంతా ప్రజలు సంతోషించినారు ప్రజల ద్రవ్యమే కదా ఈ అతిథి సత్కారానికి వినియోగమైనది కులపతులున్నూ మేధస్సంపన్నులు కదా వారు విద్యావిషయములలో దేశకాల పరిస్థితులను గమనించి ఎన్నో తీర్మానాలు కావించిరి అందు ముఖ్యాతి ముఖ్యమైనట్టిది ఇట్లున్నది —

" మెట్రికు పరీక్షలో ప్రతివిద్యార్థిని అయిదు మూల విషయాలలో అనగా మాతృభాష, ఇంగ్లీషు, లెక్కలు, సైన్సు, భూగోళచరిత్ర, ఐచ్ఛిక విషయములో పరీక్షించవలెను పైవాటిని మాతృభాషలోనే నేర్పి తీరవలెను మాతృభాషలో పరీక్షించి తీరవలెను (The medium of instruction and examination in the High School stage shall be the mother tongue )

అంతర్విద్యాపీఠ సమితివారి తీర్మానమునుగూర్చి పలువురు అపోహపడినారు అందుచేత దానిని స్పష్టము చేయుచున్నాము ఈ తీర్మానం ద్వారామాతృభాషా బోధావిషయమై పూర్వం చేసిన తీర్మానాలన్నీ రద్దయినవి మరియు బోధ ఒక భారతీయ భాషలో చేస్తే చాలు అని దీనియర్థము కాదు బాలుర మాతృభాష ఒక భారతీయభాష కానేరదు వారి మాతృభాషలోనే విద్య చెప్పించవలెనని అర్థము అట్టివిద్య ఐచ్ఛికముకాదు, అది చెప్పించి తీరవలెను (shall be) అని సుస్పష్టం చేసినారు

మనకు విద్యావిషయములో మంచికాలము రానున్నదని దీనివలన అర్థమగుచున్నది భారత దేశములో అనేక శతాబ్దా నుండి పరభాషలలో విద్యను నేర్పు గ్రహచారము బహుళ సంఖ్యాకులకు పట్టియుండెను అట్టి గ్రహబాధలు తొలగునని ఆశింపవచ్చును

## ధాన్యగ్రహణంలో కొంత మార్పు

రైతులు గమనించవలెను

హైద్రాబాదుప్రభుత్వమువారిట్లు గజటుమూలమున శాసించినారు, ధాన్యము వసూలువిషయములో తాలూక్దార్లకు పూర్తి విచక్షణాధికారాలు కలవు పజ్జలు ఆ ఆణాలకంటే తక్కువపండితే నిర్ణయమైనదానిలో సగం వసూలు చేయబడును నాల్గణాలకు తక్కువైతే రైతులనుండి ఏమిన్నీ తీసుకోబడదు. ప్రతివాని విషయములో బాగా పూర్తిగా విచారణచేసి యీ మాఫీ యియ్యబడును

తహశీల్దార్ల దృష్టికి తేవలసిన విషయాలన్నీ గ్రామకమిటీలు తేవలెనని వాటికి తెలుపనైనది

అట్టి విషయాలలో తహసీల్దారు నిర్ణయము చేసేవరకు ధాన్యము వసూలు ఆపియుంచబడును. ధాన్యంలేని రైతులను ధాన్యముకొనియియ్యవలెనని నిర్బంధము లేనేలేదు సేత్సందీయొక్కయు బలోతా దార్లయొక్కయు ఇనాంపంటలకు మాఫీ యియ్యనైనది [వట్టివడ్లు]తన్మాసి తరీపంటలలో ఎకరాకు ఒక్క మణము మాత్రమే తీసుకొనబడును.

చిన్నరైతులపంటను పూర్తిగా గ్రామసాహుకార్లె తీసుకొనుట సాధారణ పద్ధతి బలవంతపు సర్కారీ ధాన్యగ్రహణమువల్ల చిన్నరైతులకు కొన్నిరూకలైనా చేతులోపడునుకదా చాలకివారు స్వాగతమిస్తారుకదా! బజారుధరకంటే తక్కువధరలు సర్కారువారు తీసుకొన్న ధాన్యానికిస్తారనేమాట అబద్ధం ఎందుకంటే సర్కారు బజారుధరలను నిర్ణయించుచున్నారు వ్యాపారి కోరాబాదుగ వడ్డీ లాభము పోగా ఎంతధరఉండునో అధరను ధాన్యానికి సర్కారువారు నిర్ణయించుచున్నారు. కావున వ్యాపారి కమ్మినా సర్కారుకమ్మినా రైతుల కొకేధర దొరకును, సర్కారిచ్చే ధర యుద్ధానికంటే పూర్వముండినదానికంటే రెండింతధర! వీలైనంత వరకు వెంటనే ధాన్యంపైకం రైతులకిచ్చేయేర్పాట్లు చేయనైనది రైతులకు స్టాండర్డు బట్టలు ఇనుము అగ్గువగా యిప్పించే యేర్పాట్లు జేయుచున్నారు పైగా మేలైన విత్తనం ఎరువులు ఇదివరకే సప్లయిచేసినారుకదా

తిండిధాన్యాలను బలవంతముగా తీసుకొనే విషయములో ఎవ్వరెవ్వరివద్ద తమ అవసరాలను మించిన ధాన్యం ఉండేవారినుండి తీసుకొనుటకు తాలూక్దారుకు ఆజ్ఞ ఇయ్యనైనది గ్రామావసరాలనుగూడా గమనించి వసూలుచేయుటకు వారికాజ్ఞ యియ్యనైనది, ఇదివరలో స్టాకు పెట్టు

## ఆంధ్ర మహాసభ స్థాయిసంఘ ప్రకటన [౨]

### ఆహారధాన్యముల, బట్ట, మున్నగు విషయమున కంట్రోలుకు సంబంధించిన ప్రభుత్వాజ్ఞలు

ఈసంవత్సరము తేది ౧-౧౧-౫౩ ఫ ఆధిక ఆహారోత్పత్తికై ప్రభుత్వమువారు గావించిన ఉత్తరువులను తెలంగాణాకు సంబంధించినంతవరకు స్థాయి సంఘపక్షమున ప్రథమ ప్రకటనద్వారా దేశీయులు తెలుసుకొనుటకై ప్రకటించుచున్నాము

ఇటీవల ప్రభుత్వమువారు ఆహారధాన్యములను కంట్రోలుచేయుటకై అవలంభించిన విధానములకు సంబంధించిన ఉత్తరువులు, నియమములు బట్టల కంట్రోలుకొరకు తెలిపిన వస్తువులను దేశీయులు తెలిసికొనుట అత్యవసరమైనందున ఈ రెండవ ప్రకటనద్వారాఅందజేయుచున్నాము జనసామాన్యమునకు సంబంధించని ఇతర (మోటారుసైరు కంట్రోలు, పెట్రోలు కంట్రోలు) పదార్థముల కంట్రోలు ఆజ్ఞలను కొందరికిమాత్రమే సంబంధమున్నదైనందున కాగితముధర పెరిగి అచ్చుసౌకర్యములు లేనందువల్ల వదిలివేయుచున్నాము

ఇటీవల ఆహారధాన్యములను కంట్రోలుచేయుటకై ప్రభుత్వమువారు అవలంభించిన వివిధ విధానములు రాష్ట్రమునందొక్క ప్రతిపౌరునికి అతడు కాస్తుకారుకాని లేక పట్టేదారుకాని లేక పెద్ద వర్తకుడు అయినసరే చిన్నవర్తకుడైనసరే బట్టల నేతగాండ్రు అయిన సరేనా బట్టలను నెత్తిపైన పెట్టుకొని వీధులలో తిరిగి విక్రయించు కొనువారైనసరే లేదా పెద్దకోటాలు పెట్టి బట్టల వ్యాపారము చేయువారైనసరే అందరును ఈ కంట్రోలు విధానమువల్ల కొన్ని కట్టుబాట్లు నియమాలకు బద్ధులుకావలసి వస్తువున్నది కనుక వీటిని ఎప్పటికప్పుడు తెలుసుకొనుట అత్యవసరము

#### ౧ లైసెన్సు

కాస్తుకారుకానీ, పట్టేదారుకాని వందరూపాయలకన్న ఎక్కువ సర్కారీ శిస్తు చెల్లించు నట్టి భూమిపై తాను స్వయముగా కాస్తుచేసి లేక కౌలుదారువల్ల కాస్తుచేయించి ధాన్యము నిలువ చేసినచో లైసెన్సు తహసీలునుండిపొందవలెను.

౨ చిల్లరవ్యాపారముచేయు వర్తకుడు అయినచో అనగా పదిపల్ల ధాన్యము మించని ధాన్యమును క్రయవిక్రయాలవల్ల ప్రోగుచెయు వర్తకుడు లైసెన్సు తహసీలునుండి పొందుట అవసరము

౩ పెద్ద మొత్తాలను అనగా ౧౦పల్లకన్న ఎక్కువ ఆహారధాన్యముల క్రయవిక్రయాలు చేయువర్తకుడు పెద్దవర్తకుడుగా ఎంచబడును, మరియు తహసీలునుండి లైసెన్సు పొందుట అవసరము.

౪ లైసెన్సు పొంది నిలువయుంచిన కాస్తుకారు ప్రతినెల ఆఖరువరకు నిలువయున్న ధాన్యము లోనుండి ఎంత ఖర్చుఅయి మిగిలిన నిలువ లిని నమూన ప్రకారము తఖ్తామాత్రము తహసీలుకు పంపవలయును

౫ లైసెన్సుపొందిన పెద్దవర్తకుడు ప్రతిరోజు చేయు క్రయవిక్రయాముల రోజునాంచా కొన్నవారికి యిచ్చుటకు లేక పట్టీప్రతి ఇచ్చిన ఒక ప్రతి తనవద్ద ఉంచవలయును,

ధరలతఖ్తా [నిరఖునామా] ఉంచవలయును మరియు రెండవ నెల ౧౫ తారీఖువరకు తిలఖ్తా తహసీలుకు పంపుతు వుంచవలయును

౬ చిల్లర వ్యాపారస్తుడు [నిరఖునామా] ధరలను తెలుపుతఖ్తామాత్రము వుంచవలయును

వివరణ — పెద్దవర్తకుడు వుంచవలసిన క్రయవిక్రయాదుల రోజునామ్చా ఒక [పట్టీ] చిన్నవర్తకునికి లేక కాస్తుకారుకు అవసరము లేదు. చిన్నవర్తకుడు నిరఖునామా మాత్ర ముంచవలయును. కాస్తుకారు నిరఖునామాకూడ అక్కరలేదు. నెలకు నిలువతఖ్తా మాత్రము వుంచవలయును.

౭ ఈవిధముగా లైసెన్సుపొందినట్టి కాస్తుకారు పట్టేదారు వర్తకుడు తాము నిలువయుంచిన ధాన్యముల కోటాలను ఇజాజతునామాలు ఇచ్చు అధికారి తహసీలుదారుకాని, ఇంకా ఎక్కడైన అధికారముపొందిన అధికారికాని ధాన్యమును తనిఖీచేయుటకు కోరినచో తనిఖీ చేయించవలయును రిజిస్టర్లు మున్నగువాటిని పరిశీలించుటకై కోరినచో పరిశీలనకై చూపవలయును

౮ ఆహారపదార్థముల ధరలను ప్రభుత్వమువారు నిర్ణయించిన ధరకే విక్రయించవలయును

౯ ఆహారపదార్థము అవసరమైనపుడు ప్రభుత్వము కొనుటకు ఉద్దేశించి కోరినపక్షమున నిర్ణయింపబడిన ధరలకు ప్రభుత్వమువారు ఏర్పాటు చేయు లాభమునైన ప్రభుత్వమువారికి విక్రయించవలయును లైసెన్సుపొందిన వ్యాపారస్తుడు కాస్తుకారు పట్టేదారుకానీ ఈవిధముగా విక్రయించుటకు నిరాకరించినపక్షమున ప్రభుత్వమువారు పూర్తిధాన్యమునుకాని లేక అవసరమున్నంత వరకుకాని పైనతెలిపిన ధరప్రకారము ఆహారపదార్థములను హస్తగతము చేసుకొనవచ్చును.

౧౦, దీనికిసంబంధించిన నియమాలను అతిక్రమించినచో లేక లైసెన్సును భిన్నముగా వర్తించినచో లైసెన్సు రద్దుచేయుటయేకాక మొత్తం ఆహారపదార్థములను ప్రభుత్వము తమస్వాధీనము చేసుకోవచ్చును. మరియు శిక్షా స్మృతి ప్రకారము నేరారోపణకూడా కావింపవచ్చును.

౧౧ లైసెన్సుఫీజు లేకుండా ఉచితముగా ఇవ్వబడును దరఖాస్తులు ఏర్పరచబడిన నమూనాల ప్రకారము వివరాలుపూరించి తహసీలులో చేయవలయును జిల్లాసంఘము కేంద్రాలవారు మాలు మదదుగారువద్ద పేష్ చేయవలయును లైసెన్సుఇచ్చుటకు నిరాకరించినను లేక ఇతరఉత్తరువు లివ్వబడినను వాటి మురాఫాతాలూక్దారులో చేయవచ్చును

౧౨ లైసెన్సుపొందుటకై నిర్ణయింపబడినఆహార ధాన్యముల వివరము —

౧ వడ్లు ౨ బియ్యము

౩ గోధుమలు, మరియుగోధుమలతో ఉత్పత్తి యగుపిండిమైదా, దవ్వ, సొజ్జ, రొట్టె —

౪ జొన్నలు ౫ సజ్జ

౬ పెసలు, కందులు, మరియు ఇతర చిన్న గింజలు

౭ పిరిసెనిగలు, శనగలు, బొబ్బర్లు, అనుములు, అలసందలు, మినుములు, బటాణీలు, మరియు పేటిపప్పు మరా - (తమిదలు, కొర్రలు, ఆరికలు, సామలు ఇత్యాదిచిల్లరగింజలు లైసెన్సుకొరకు ఆహారధాన్యములుగా ఎంచబడవు. మాతృభిప్రాయము అయినను ఆచరణలో ఏవిధముగానుండునో లైసెన్సుపొందు సమయమున తహసీలులో తెలుసుకొనుట అవసరము కార్యదర్శి)

(౧౩) ౧౦ మణుముల ధాన్యమునకు మించనివర్తకము చేయువ్యాపారస్తుల వసిమణుములకు మించని నిలువయుంచుకొనని కాస్తుకారుకు ఎలాటి నిబంధనలు లేవు కాని ౧౦ మణుములకుమించి ౫౦ మణువులవరకు వ్యాపారముచేయు చిల్లరవర్తకులు, కాస్తుకార్లు, స్థానిక పటేలు పట్వారీలకు తమ వద్ద నిలువయున్న ధాన్యములను తెలుపవలెను

నోటు - లైసెన్సుమున్నగువాటిని వివరముగా తెలుసుకొనదలచినవారు జరీదాసర్కారాలీ తేది ౧౩౫౩ ఫ ౧౧౫ చూడవచ్చును

౨ పంటలలో నుండి కొంతభాగము ప్రభుత్వము వారికి విధిగా వారు నిర్ణయించే ధరలకు ఇచ్చుటకు జారీచేయబడిన నియమాలు

౧ కాస్తుకారులో విధిగా ధాన్యమునువసూలు చేయుటకై గ్రామములో ఒకకమిటీఏర్పడును ఈ కమిటీలో పటేలు పట్వారీలతోపాటు ఎక్కువతక్కువ గ్రామస్థులలో నుండి ౫గురు నుందురు

౨ పంటలు కోతకు వచ్చిన సందర్భమున గ్రామకమిటీకి కాస్తుకారు తానిచ్చినధాన్యమును కమిటీ నిర్ణయించేధరలకున్నట్టి రశీదు తీసుకొనవలయును.

తెలంగాణాలో వర్షం ఎకరమునకు ౨ మణుములు లేక ౧ మణుముమించకుండ మరియు ఇతర ఆహారధాన్యములు ఎకరమునకు ౧మణుముకాస్తు అయినంతవరకు ఇవ్వవలయును

మహారాష్ట్ర కర్నాటకజిల్లాలలోవడ్లు, ఎకరమునకు ౨మణువులు ఇతరఆహారధాన్యములు ఎకరమునకు ౧ మణుము కాస్తుఅయినంతవరకు ఇవ్వవలయును. ౩పంటలుకోతపడక పూర్వమే కమిటీయొక్క అభిప్రాయముతో పటేలుపట్వారీలు ఒకతఖ్తా సిద్ధపరచవలయును. అందులో ఆహారధాన్యములకై సిస్తుచేయబడిన భూమియు మరియు ప్రతికాస్తుకారుతోవసూలు కావలసిన ధాన్యముల వివరములనుచూపును ప్రతికాస్తుకారు ఎంతధాన్యము ఇవ్వవలయునో తెల్పి అతనికి తెలుపవలయును

౪ పటేలుపట్వారీలు మరియు గ్రామకమిటీ సభ్యులు కాస్తుకారుకు అతడుఇచ్చినధాన్యమునకు బెటకే ధాన్యము ధర ఇచ్చి రసీదు తీసుకొనవలయును.

౫ వసూలు కావలసినధాన్యమును నిర్ణయించుటలో, వసూలుచేయుటలో, స్వాధీనపరచుటలో కమిటీయొక్క తప్పిదమువల్ల ప్రభుత్వమునకు గాని లేక కాస్తుకారునకు కాని నష్టము కలిగినచో కమిటీసభ్యులపై బాధ్యతయుండి వ్యవహారమునడిపింపబడును ౬ ఈనియమములను అతిక్రమించినచో మూడుసంవత్సరముల జేలుశిక్ష ఇవ్వబడును మరియు జుర్మానాకూడా వేయవచ్చును

౭ వ్యక్తులను, వర్గములను, ఈ నియమముల నుండి మినహాయింపుచేయుఅధికారము సదరునాజిం రసదుకుండును.

ఈనియమములకొరకు ప్రభుత్వమువారునిర్ణయించిన ఆహారధాన్యములవివరము

౧ వడ్లు, బియ్యము, గోధుమలు, జొన్నలు, సజ్జలు తమిదలు, మరియు ఇతర చిన్నగింజలధాన్యము

నోటు - కాస్తుకారు విధిగా యివ్వవలసి, ఆహారధాన్యము సందర్భమున ప్రభుత్వపు ప్రకటనలు తమపూర్వ ప్రతిఉత్తరువులను స్పష్టపరచినారు అందులో ఈ క్రిందివిషయాలు ముఖ్యమైనవి,

౧ విధిగా యివ్వవలసిన ధాన్యమువిషయమున జిల్లాతాలూక్దార్లకుఉత్తరువుల ఆచరణలో తమతెలివి తేటలను ఉపయోగించుటకై అధికారములు యివ్వనైనవి పంటలు రూపాయిలో అర్ధముకన్న తక్కువయున్నచో యీకరమునకు యివ్వవలసినధాన్యములో ప్రభుత్వముసగముమాత్రమునకోరుకొనబడును, ఆవిధముగా పంటలురూపాయిలో నాలుగుఅణాలకన్న తక్కువయున్నచో కాస్తుకారుకు ఈమాఫీసంపూర్ణముగాలభింపబడును, ఈవిధముగా పరిస్థితులు పూర్తిగాపరిశీలించవలయును, గ్రామకమిటీలు ఈవిషయమున తమఅభిప్రాయమును, సౌకర్యములుయివ్వుటకు ఏర్పడినకారణములనుతహసీల్దారులకు తెలుపవలయును, తహసీల్దార్లు ప్రతివిషయమున విచారించియు పరిష్కారము చేయువరకు ఈలాంటికాస్తుకార్లతో ధాన్యమునుతీసుకొనుటకు ఆపివేయవలెను, కావున ధాన్యముపండని కాస్తుకార్లుకొని తెచ్చి తాము యివ్వవలసినధాన్యమును యివ్వవలసినదనే సమస్యకలుగ నేరదు,

### ౩ సజ్జలు, మక్కజొన్నలు, లక్క ప్రత్యేకాజ్ఞలు

౧ కమర్షియల్ కార్పోరేషను సంఘమువారు లేక వారితరపున నియమింపబడే ఏజెంటులకు మాత్రమే సజ్జలు, మక్కజొన్నలు అమ్మవలయును

౨ ఈరెండు ధాన్యములధర సదరునాజిం రసదుగారు నిర్ణయించుప్రకారము ఇవ్వబడును

౩ ఈనియమములకు భిన్నముగా వర్తించినచో శిక్షపాత్రులగుదురు

షరాహ — మక్కజొన్నలు, సజ్జలు ౧౦ మణుముల అంతకుమించినధాన్యమును అమ్మినచో టోకుఫరోషిఅనగా పెద్దవిక్రయము అనబడును కొనుట ౧౦మణుములకుతక్కువ సజ్జలు, మక్కజొన్నలు, కొనుఅమ్ముకొనుటకు అక్షేపణవుండదు,

### ౪ నూనెధాన్యములని బంధనలు

ఈక్రిందిధాన్యములు నూనెధాన్యములుగా ప్రకటింపబడినవి —

వేరుశెనగ, ఆవుశాలు, ఆముదము పుక్క (పెద్ద ఆవాలు) ఆముదాలు, పత్తిగింజలు, నువ్వులు

ఈధాన్యములకు వ్యాపారము ఆచారప్రకారము జట్టీలుగా చేయబడు క్రయవిక్రయాదుల ఏర్పాట్లు గజటుగావున తరువాత చెల్లవు, గజటుకాకమునుపు పూర్వము కట్టిన ప్రకారముచేయబడినవ్యవహారములకై ప్రభుత్వమువారు చేయునియమములలోబడి మొందు అమలులోనికిరాగలవు.

### ౫ బట్టల కంట్రోలు -

మారకమదీసనతుదహిర్పతు (వాణిజ్యపరిశ్రామిక శాఖ) ప్రకటనజరీదా ౧౦వ సై ౧౩౫౩ ఫ తేదీ ౧౮౧

౧ బట్టలవ్యాపారముచేయువారిలో వీధులలో తిరిగి అమ్ముకొనువారైనసరే లేక దుకాణము పెట్టి అమ్ముకొనువారైనసరే లైసెన్సుపొందవలయును

దుకాణము పెట్టివ్యాపారముచేయు వారుకిరూపాయలు చెల్లించి సర్టిఫికెట్టుపొందినవారు వీధులలోతిరిగి అమ్ముకొనువారు ఆరా లైసెన్సుఫీజు చెల్లించవలయును.

( ౫ వ పేజీ చూడుడు )

[ ౨ వ పేజీ తరువాత.)

౨ జిల్లాలలో తాలూకాదారునుండి హైద్రాబాదు పట్టణమున "కమీషనరుపోలీసుండి లైసెన్సును పొందవలయును.

౩ కేవలను నూలుదారముతో యైననుకేక నూలుదారముతో తయ్యారుఅయిన గుడ్డకుకేక నూలుదారము కలిపితయ్యారు చేయబడిన గుడ్డకు మాత్రమువర్తించునుకాని కేవలము పట్టు,ఉన్ని, కేక నారతోనిర్దము జేయబడిన బట్టలకు వర్తించదు.

౪ బట్టలునేయు కార్ఖానాలకు మరియువ్యక్తులుస్వయముగా కాని లేకతమ కుటుంబముల వారితో కానినేయించి అమ్ముకొను వారికి ఈనియమము వర్తించదు

౫ సంవత్సరానికి ఒకరూపాయి చెల్లించి లైసెన్సును పునరుద్ధరించుకోవలయును.

మం. రామచంద్రరావు.
కార్యదర్శి

